# శ్రీ
# రామశతకము.

# విజ్ఞప్తి

"సూక్ష్మములో మోక్ష" మను సామెత యెల్లరకుం దెల్లమేకదా. దానిననుసరించియే దీనిని వ్రాసితిని. అందరకుం దెలియునట్లును, మిక్కిలి తక్కువ కాలములోనే ముగియునట్లును, ముఖ్యాంశములను నీతులను దెల్పునట్లును, లోకోపయుక్తమగునట్లును, రచియించితిని. చదువరు లిందుగుణలేశములున్నచో గ్రహింతురుగాక.

ఇట్లు,
బుధ విధేయుడు
వెణుతురుపల్లి సన్న్యాసిరాజు

శృంగవరపుకోట.
16-11-1924.

శ్రీరామాయనమః.

# రామాయణశతకము.

1 క. శ్రీలోలా! శ్రితపాలా!
కాలాత్మక రూపజాల! ఖలనిర్మూలా!
లీలా వినోద ఖేలా!
లాలిత సుగుణాలవాల! రామనృపాలా!

2 క. నీచొరని చోటు లేదిల,
నీచేయని పనులు లేవు, నిత్యుఁడ వీవే,
నీచిత్తవశము సర్వము,
నీచూడని దేది లేదు, నిఖిలేశ! హరీ!

3 క. రామా ! నీచారిత్రము
నేమాత్రముఁ దెలుపఁ జాలరిందరు సరిగన్ ?
గోమాయువేడ ? సురపతి
ధామంబది యేడ ? నాదు తలఁపు నిలుమా.

4 క. నీనామ, రూప, గుణముల,
నానావిధలీల, లెన్న నాకుఁ దరమా ?
ఐనన్, గొద్దిగఁ జెప్పఁగఁ
బూనితి, భవదత్తయోగ బుద్ధిన్, శుద్ధిన్.

5 క. దానవమూఁకల బాధలు,
వానక రెట్టింపవివిధ మార్గముల, సురల్
పూని భరింపంజాలక,
వానినివారింప, హరినిఁబ్రార్థించిరో గిరా.

6 క. దుష్టజననిగ్రహుండును,
శిష్టానుగ్రహుఁడు, నైన శ్రీహరి, కరుణన్
స్పష్టీకరించె, దైత్యులఁ,
గష్టాత్ములఁ, ద్రుంతుననుచుఁ, గావఁగసురలన్.

7 క. హరియానతివ్వి యీగతి,
మరుమేనున, రామచంద్ర మనుజేంద్రుండై,
భరతాదినామరూపము,
లిరవొందన్, నాల్గుగతుల, నేర్పడఁబుట్టెన్.

8 క. సర్వముఁదనలో సిడుకొని,
సర్వమునన్ దానెయుండి, సర్వసముండై,
ఉర్వీరమణుఁడు, నేత్రిను
పర్వంబుగఁదోఁచె, నమిత ప్రాభవశక్తిన్.

9 క. ఆటలపాటలనాడే,
నూటిగ గాదేయుక్రతువు, సురుచిరలీలన్
బాటించి, కాచెరాముఁడు,
బూటక తాటకనుజంపి, మున్ముందుతగన్.

10 క. మారీచుఁ దోలె, సుబా
హున్ రాముండాజిఁద్రుంచె, హాయనిమునియున్
శ్రీరాముఁబొగడి, మఖమున
పారానందమునజరిపెఁ, బ్రబ్బిన భక్తిన్.

11 క. గౌతము శాపవశంబున,
రాతిగఁ బడియున్న హల్య, రమణిగ మగుడన్
బ్రీతిన్ జేసెను రాముఁడు,
పాతక మెడఁబాసి హల్య పా[illegible]ం చెనారిన్.

12 క. మునియును, జనకుఁడు, సీతయు,
జనపాలకులెల్లఁ జూచి, సన్నుతిఁ జేయన్,
అనలాక్షుని ఘనచాపము[illegible],
దునిమెన్ రఘురామవిభుఁడు, దోశ్శక్తి మెయిన్.

13 క. రాముఁడు, మహనీయగుణ
స్తోముఁడు, రవివంశజలధి సోముఁడు, జనతా
కాముఁడు, మేఘశ్యాముఁడు,
రాముఁడు పెండ్లాడె సీత, లావణ్యయుతన్.

14 క. కురిసెన్ బువ్వులవానలు,
పరఁగెన్ జయశబ్దతతులు, భరములుదొరఁగెన్,
మొరసెన్ నిర్జరదుందుభు,
లరిగెన్ గురుదురితకరము, లాత్రిఁగనై.

15 క. రాజులరూపడఁచిన సు
స్తైజమయుఁ, బరశురాముఁ, దీవ్రశరాగ్నుల్
రాజిల్లభంగపరిచె, వి
రాజితుఁడై, సీతఁగూడి, రాఘవుఁడంతన్.

16 క. కైకకుమున్నిచ్చిన వర
ముకతన, సత్యంబునిలుప, ముద్దులరాముఁ
శ్రీకరు, దశరథుఁడనిచెను,
భీకరవనికేగఁ, గైక ప్రీతిఁజెలంగన్.

17 క. తగునని, తగదని, మనమున
వగవక, తమకార్యమగుట ప్రాధాన్యముగా,
మగవారివశులఁ జేయుచు,
మగువలుపీడింత్రు. కసరు మంచియుఁ, జెడ్డన్.

18 క. మిత్రత్వము మదిఁదలఁచ,
పుత్రత్వము నరకుఁగానరు, భూరిగుణాఢ్యుల్
పాత్రము, ధర్మము, సత్యము,
మాత్రమెపాటింత్రు, సత్య మార్గమునిలుపన్.

19 క. వద్దని సీతకు రాముఁడు,
సుద్దులు జెప్పినను, వినక, సుదతికిఁ బతియే
పొద్దును దైవమటంచును,
ముద్దియ వెన్వెంట వేడెఁ, బూనితభక్తిన్.

20 క. వదలెద రాజ్యము, గీజ్యము,
వదలను శ్రీరామపాద పద్మములనుచున్,
గదలెను లక్ష్మణుఁ డెన్నఁగ,
నిదిపోఁగదా భ్రాతృభక్తి, యిహమున్, బరమున్.

21 క. తలఁదాల్చి జనకునాజ్ఞను,
నిలిపెను రాజ్యమున భరతు, నిరతముఁ దన్నున్
గొలువఁగ సీతాలక్ష్మణు
లోలిన్, శ్రీరామవిభుఁ డయోధ్యన్ విడిచెన్.

22 క. జనకుని సత్యము నిలుపఁగ,
వనవాసముఁ జేసినాఁడు పదునాల్గేడుల్,
తన యుండన, రాముఁ డెకద,
వనితలు, సీతమ్మకు సరివత్తురె జగతిన్?.

23 క. సీతాలక్ష్మణరాములు,
ప్రీతిన్ వనవాసగరిమఁ బ్రేమించుచు, న
చ్చేతోమోహనము గనుఁగఁ
గోతులగమిఁగనిరి, చిత్రకూటాద్రిపయిన్.

24 క. వారటఁ గాంచిరి చేరువ,
సారయశస్సౌందర్యయోగి సంజీవనమున్,
బూరితలక్ష్మీభవనము,
దారిద్ర్యదవానలమును, దండకవనమున్.

25 క. ఆతఁడిరావణుసోదరి,
ప్రీతినిరతిఁగోర, దాని విక్కృతన్ జేయున్,
ఏతెంచి, మ్రిగ్గనిలోఁ,
ఘాతకఖరదూషణాది వ్రాతము, హరిచేఁ.

26 క. విక్కముగ నొంటినొక్కతె,
మొక్కవరతిఁగోర, దాని మరలింతురొకో?
తక్కవలె వెంటఁదగులరె?
తొక్కరుగద ఏకలట్టి దుష్పథమెవరున్.

27 క. మాయామృగమగుదనుజు, గ
కాయువునీఁ జేసెరామ ధరణిపుఁ, డాలో,
మాయాబ్రాహ్మణ భిక్షుఁ
డై, యబలన్, సీత, రావణాసురుఁడు గొనెన్.

28 క. మాయావృత్తైనదనుజులు,
మాయలనే జేతురెప్పుడు, మాంచిగఁబో, రా
మాయలె దీయునువారల
ఆయువుఁ దుదముట్టు, నీశ్వరాజ్ఞాకృతమై

29 క. ఆయోషనడ్డంబైన జ
టాయువుపైఁ దుమించెదనుజుఁ, డతనికిఁ గ్రియలన్
జేయించెరాముఁ, డారయ,
ధీయుతులెప్పుడు, భగవద ధీనులుసుండీ.

30 క. ఇనకులజులు సీతనుదగ,
వనమెల్లనువెదకి, వెదకి, ఫలితము లేమిన్,
ఘనఋశ్యమూకమునకున్
జని, గాంచిరియినతనూజు, సంగడికాఁగన్.

31 క. నీయన్న, ద్రోహి, వాలి, వ
శేయుండని యెంచి, భీతిఁ జెందకుమిఁక, నే
మాయింతువానిఁ, గపుల స
హాయంబిడుమయ్య, సీత నన్నిఁట వెదకన్

32 క. అనియినకులజుండినసుతుఁ
గని, పల్క, తదగ్రజాతు ఖండించెఁ, గపుల్
వనివిని, దశదిశలకు, వేఁ
గన నేగిరిసీత, రామ కార్యాతురులై

33 క. ఘనుఁడైనఁ, గొన్ని వేళలఁ,
దనకుఁ, సాహాయ్యములను, దప్పక చేయున్
ఘను, దినసుతుఁడటు మెలఁగెను,
ఘనస్నేహము లొప్పె, నిజముగా వెలయు, నిలన్

34 క. హనుమంతుఁ డవుడు దాఁటెను
వననిధి నవలీల, నమిత ప్రాభవశక్తిన్,
గని సీత లంక వెదకుచు,
దినకులజుల వార్తఁ జెప్పె, నింగితబుద్ధిన్

35 క. రామునిముద్రిక సీతకుఁ,
ప్రేమన్ గైకొనఁగనిచ్చి, ప్రీతినిమరి, యా
రామశిరోమణిఁగొని, యా
రామంబునుబెరికి కాల్చెలంకన్ గిన్కన్

36 క. అనిలజుఁడు పెక్కురీతుల,
దనుజులమ్రగ్గించి, మరల దాఁటెన్, జలధిన్,
మనుజేంద్రుమ్రోలనిలిచి, సు
వినయమునన్ జెప్పె, సీత వృత్తాంతంబున్

౪37. రాముని కరుణమెహోంని,
ధీమంతులఁ జేసి, యమిత ధృతినొసఁగుఁజుఁడి
సామర్థ్యమెట్లుగలిగిన
దామారుతికబ్ధిదాఁట, నటుఁగాకున్నన్?

38 ౪. వారెల్లరబ్ధిఁ జేరి, యు
దారతమార్గంబునిడఁగ, దానినివేడన్,
దారినదినూపకుండిన,
ధారుణిపతి వింటినంట, దారినొసంగన్

39 క. నయమునకన్నను, హెచ్చగు
భయముననే, యొక్కవేళఁ, బనులొనఁగూడున్,
నయమున దారి నొసంగనె?
భయముననేగాదె, యబ్ధి, ప్రార్థించె వారిఁ?

40 క. బలిముఖులెల్లరుఁ గట్టిరి,
జలరాశిని, గురుతరయూరు శైలావళిచే,
బలశాలి వాలిఁ గూల్చిన,
బలయుతు, శ్రీరామచంద్రు బలమున, బలులై

41 క. రామా ! శరణమునిమ్మా?
ప్రేమన్, ననునేలుమన, విభీషణునకు, శ్రీ
రాముం డభయంబిచ్చెను,
గామితముం గాగఁదగుట, గౌరవమొప్పన్

42 క. చొచ్చిరి వానరులంకన్,
గ్రొచ్చిరిఘన సౌధపంక్తిఁ, గోటలుఁ, బేటల్,
వ్రచ్చిరిసగ్యము, దైత్యులఁ
జిచ్చులపిడుగులవిధాన జీల్చిరిడొక్కల్,

43క. కుంభ, నికుంభ, సురాంతక,
దంభోద్ధతులెల్ల, రాము దత్తాగ్నిఁబడన్,
స్తంభించి, కుంభకర్ణుఁడు,
కుంభిపైఁగూలె, రాము ఘోరాస్త్రములన్

44క. అతికాయ, మేఘనాధుల,
మతిమంతుఁడు, లక్ష్మణుండు, మ్రగ్గించె, ననిన్,
జతురత. నిజ్జ్వలసాయక
వితతుల, శ్రీరామవిభుఁడు, వేడుకఁ జూడన్

45 క. మాయావి, యింద్రజిత్తుఁడు,
సాయకమున, రాముతమ్ముఁ సౌమిత్రిని, మూ
ర్ఛాయుతుఁ జేసెను, రాముఁడు
హా! యనుచును, దమ్ముఁగూర్చి, యాలమటనొందన్

46 క. వాయుతనూజుం డప్పుడ,
వాయురయంబునను, ద్రోణ పర్వతమునకుఁ
బోయి, మగుడ, సంజీవని
శ్రేయంబుగఁ దెచ్చి, ఘనుని జీవమునిలిపెన్

47 క. సీతను వెదకితి, మారుతి !
నాతమ్ముని నిలిపి, తీవు, నాతమ్ముఁడ వే,
నాతాపశాంతిఁ జేసితి,
నీతో, సరిపోల రెందు, నిఖిలధ క్త్రిన్.

48 క. అనుచున్, లక్ష్మణు, మారుతిఁ,
దన కౌఁగిటఁ గదియఁ జేర్చి, తన రారె విభుం
డనువను సంతోషంబున,
ఘనులుగదా, రామకార్య కరు, లరయ, ధరన్

49 క. సుతులును, బంధులు, సేనలు,
హతులగుట, సురారి, యప్పు, డాహవమునకఁ,
ధృతిఁజెడి, వచ్చెను, రాముని
సతిఁదెచ్చుటకతన, నింతసాగెను,బలమై.

50 క. ఆతరి, సురపతిపంపున,
మాతలి, యొకదివ్యరథము, మనుజేంద్రునికైఁ,
బ్రీతిన్, గొనిరా, నెక్కెను,
సీతాపతియొప్ప, నపుడు, శృంగారంబై.

51 క. దశరథసూనుండయ్యెడ,
దశకంఠునిఁ గూల్చి, రక్త ధారలుదొరఁగన్,
విశదీకరించు చప్పుడుఁ,
బశువా! నీపాపఫలము, పండె నటంచున్.

52 క. మందోదరి రావణుకైఁ
గుందెను, బరితాపవహ్నిఁ గూలఁగ, నకటా!
పొందితెయీగతి, సీతా
సుందరిపొందేలఁ గోరి సోలితివనుచున్.

63 క. రావణుకంపెను, నీకుయె,
భూవినుతముగాఁ గమనియెఁ బుణ్యాత్మకమై,
రావణుఁడీవిషయంబునఁ,
గావర మొందుచును, గన్నుఁగానక, జెడియెన్:

64 క. ఏదినఁటులు, విందురే, హితములఁ?
దనియకఁ, బరవనితఁగోరి, దగ్ధులుగారే,
ఘనపుత్ర, మిత్ర, వనితా,
ధన, బంధు, చయంబుతోడ, దశకంఠావలెఁ?

55 క. అంతట, రాముఁడుగాంచెన్,
గాంతన్, భూజాత, సీతఁ, గరుణోపేతన్,
స్వాంతమున, నెపుడు, విభుపద
చింతన్ దవిలించి, కడుఁగృశించిన గుణన్.

56క. తాపంబునొందిరాముఁడు,
పాపరహిత, సీత, యనుచు, వహ్నియు, దివిజుల్,
రూపించి, సీతఁగొనుమన,
భూపుత్రినిఁబొంది, యమిత మోదమున్, జెందెన్.

57 క. పాతివ్రత్యమె, స్త్రీలకు,
నీతియు, మానంబు, ఘనత, నిర్మలయశముల్,
నాతికి, నిహాపర, మిదియే
భూతియు, మరిలేవు, దీనిఁ బోలెడు, వ్రతముల్.

58 క. శరణని వేఁడు విభీషణుఁ,
దిరముగ, లంకేశుఁ జేసి, దివిజులు మెచ్చన్,
ఉరుదనుజ వీక్షమానిపి,
ధరణీపతి వెడలె లంక, దారాయుతుఁడై

59 క. సీతా, నుజ, కపిముఖ్య, స
మేతుండై, రథము నెక్కి, మింటన్, దివిజుల్,
ప్రీతిఁగురియు పూసోనల,
నాతరిఁదడియుచును, రాముఁ డరిగెన్, బురికిన్.

60 క. నందిగ్రామముఁ జేరఁగ,
సందడిగా నెల్లవారు స్వామినిజూడన్,
బొందుగ, శిరమునఁ, బాదుక
లందముగా మోచి, భరతుఁ, డన్నకు, నెరఁగెన్.

61 క. వేనోళ్లరాముఁబొగడిరి,
కానంబడెదంచుఁజాల కాలంబునకున్,
మానోముపండెనని, వే
గాన, నయోధ్యకును జనిరి, కాకుత్స్థునితోన్.

62 క. సమయానుకూలముగఁ, దగ,
సుమతులుపూజింపఁబడుచు, శోభిల్లుదు, రే
సమయమునన్నైన నొందరు,
కుమతులు, మరి యూద, మహినిఁ, గొంచెంబైనన్.

63 క. తల్లులకు మ్రొక్కి, తమ్ముల
నెల్లరఁ, దనయక్కుఁజేర్చి, యిష్టులఁగని రం
జిల్లఁగ, సచివుల, భృత్యుల,
నల్లనఁ, దగ, నాదరించె, ననఘుం, డపుడున్.

64 క. పోయినపంచప్రాణము
లాయెడఁ, దగ, వచ్చె, మగుడ, నని, యమ్మాతల్
కాయములఁబెంచి, వారల,
ధీయుతులన్, గౌఁగిలించి, తెలిసిరివార్తల్.

65 క. మంగళస్నానములాడిరి,
పొంగుచుదంపతులు, వివిధ భూషాంబరముల్,
రంగుగఁదాల్చిరి, రాముఁడు,
శృంగారములొల్క, నెక్కె, సింహాసనమున్.
66 క. గురువులుఁ, బెద్దలు, బంధులు,
వరమిత్రులు, సచివు, లెల్ల పరివారంబుల్,
గురుసభనలంకరించిరి,
ధరణీపతి, రాజ్యభరముఁ, దాల్చినయాపుడున్,

67 క. దేవతలుపుష్పవర్షణము,
వావిరిగాఁగురిసిరపుడు, బాడిరికాంతల్,
దేవఝులెల్లవచ్చిరి,
పావనకరు, రామునభకుఁ, బావనమొందన్.

68 క. కరి, హయ, రథ, భేరులతోఁ,
దరుచరని కరములతో, నుదారతనొప్పన్
బురమెల్ల, నపూర్వంబుగ,
నుతపతిపురికన్నఁ, జాల శృంగారంబై.

69 క. కానుకలిచ్చిరి విభునకుఁ
బూనిక, సేవలను జేసి, పొంగిరిమదిలో,
దీనార్త బంధుఁడని, హరి,
మానసములనిల్పి రెల్ల, మహితగుణాఢ్యుల్.

70 క. దానములనిచ్చి రాముఁడు,
వానరులును, బంధు, మిత్ర, పరివారంబుల్,
కానుకలఁగొనుచుఁ, దమతమ,
స్థానంబుల కేగిరంత, సఫలీకృతులై.

71 క. భగవంతుఁడైన రాముని,
జగధీశుని, వశముసేసి, జానకి భక్తిన్,
దగురీతి, మెలఁగుచుండెను,
భగవంతుఁడు వశుఁడునుండి, భక్తికి, నెపుడున్

72 క. కలుగుఁగా, గూరిమిప్రజలకు,
వెలయుఁగా, ఘనధర్మవిధులు విప్రులుసుఖులై,
తొలఁగుఁగా, బీడలు, సీతా
లలనేశుని పాలనమున, లక్ష్మియానిండెన్.

73 క. వార్తలవినఁ, దిరుఁగఁగ, భూ
భర్త, నిగూఢముగ, రేయిఁ, బతివిడిచిన దు
ష్కీర్తినిఁ జేకొన, రఘుభూ
భర్తనె, యనునొకని మాట, బాగుగ, వినియెన్.

74 క. చారుల చేతను గూడను,
ధారుణి, నీవార్తగలుగఁ దగ, విని సైప
న్నేరక, హరి, నిద్రించెడు
దారను, వాల్మీకియొద్దఁ, దా, విడిపించెన్.

75 క. జనములు సత్యమెఱుంగక,
ననుచుందురు యిచ్చవచ్చునట్టుల, వారిన్,
ఘనముగ మెప్పించుటకును ,
జనములనమ్మించఁ, గడఁగఁజనదీ, జగతిన్.

76 క. సీతయు, గర్భిణిగావున,
నాతరి, సుమశరునిమించు నర్భకయుగమున్,
బ్రీతిన్, గనెఁ, గుశలవులను,
భూతలమున, నద్వితీయ భుజవిక్రములన్.

77 క. శస్త్రాస్త్రవిద్యలెల్లను,
శాస్త్రములను, వేదములను, జతురత మెరయన్,
శస్త్రాస్త్ర వేదవిదుఁడును,
శాస్త్రజ్ఞుఁడు, నైన, మాని, చయ్యన, నేర్చెన్

78 క. రామానుజులకుఁగూడను,
గాముని, [illegible]రసించు, సుతులుఁ, గల్యాణయుతుల్
ధీమంతులు, బలవంతులు,
సామంతులుఁ, బుట్టి, రధిక సద్గుణవంతుల్.

79 క. తనుఁ దానకూర్చి, యధ్వర
మును, జేయఁగ నెంచి, యశ్వమును, విడిచె నృపుం,
డనఘుండు, భరతుఁ, డన్నకుఁ
గనకాదులనిచ్చెఁ, గూల్చి, గంధర్వతతిన్.

80 క. లవణుని, శత్రుఘ్నుం, డిల
నవలీలన్, గూలఁ, దునిమె, నాతనిపురమున్.
బవరమున నేసెఁ, బట్టిరి
సవనాశ్వమును, గుశలవులు, సాహసవృత్తిన్.

81 క. ఘనులొకరినొకరెరుంగమి,
ఘనబాహాబలమునూపి, కదనమునందుఁ,
సునిశితశరములఁ, దండ్రిల
తనువుల, నొప్పించిరప్పుడుఁ, దనయులు, ఘనులై
82 క. ఇదియేమి చిత్రమొకో?
మృదుతర దేహులును,జారు మృదుభాషులునై,
మదిఁ, గరఁగఁ జేయుచున్నా,
రదిగావున, విడువుఁడశ్వ మని రాతండ్రిల్.

83 క. ఇలఁబ్రోచురాముకడుపున,
వెలయుటవింతౌనె, యిట్టివీరులు, జగతిన్?
బులికడుపునఁ, బులిపిల్లయె,
లలితముగా వెలయు, వేరులాగున, నగునే?

84 క. శూరుఁడు, రాముఁడు, జనకుఁడు,
ధీరుఁడు, వాల్మీకి, గురుఁడుఁ, ద్విజగన్నుతయూ,
వీరవతివ్రత, సీతకు
మారులు, కుశలవుల, కిట్టి మాన్యులు, గలరే?

85 క. రాముకథలెల్లఁ బాడుచు,
రామునియాగంబుసూడఁ, రాజతనూజుల్,
కోమలగాత్రులు, రాఁగా,
మైమఱచిరి, వారిగాన మాధుర్యమునన్.

86 క. తలిదండ్రులెవరుమీకని,
లలితోక్తుల, బాలకులను, రాముండడుగన్,
విలసితవాల్మీకికి, మును
మల, మిట, నీకృతువుసూడ, మనసయ్యెఁ, గడున్.

87 క. అని, వారు, తెలియఁబలుకఁగ,
విని, రాముఁడు, మందహాస వికచాననుఁడై,
కనియెదరు మీఁదుజనకుని
నని, బాలురబుజ్జగించె, నయ్యెడఁ, బ్రీతిన్.

88 క. సీతను, మనుమలఁ, దోడ్కొని,
బ్రీతినివాల్మీకివచ్చి, వేఁడెనురామున్,
సీతను జేకొను మనుచును,
బూతను, సుచరిత్ర, నమితపుణ్య, నగణ్యన్.

89 క. సంగములవీడి, పుత్రుల,
సంగతిగా నొప్పగించి సంయమికిని, సీ
తాంగనభూమిం జొచ్చెను,
బొంగుచు శ్రీరామభక్తి పొరలఁగ, మదిలోన్.

90 క. శోకించెసీతకొఱకైఁ,
గాకుత్స్థుఁడు, దేవుఁడయ్యుఁ, గడుదీనుండై,
శోకముగాదే యెరిక,
రాకేందునిభాబ్జముఖుల, రమణులఁ, బాయన్?

91 క. సతిఁబాసి, బ్రహ్మచర్య
వ్రతమున, సెల్లించెనిత్య వహ్నులు, నియతిన్,
క్షితినేలెరామచంద్రుఁడు,
పతియై, పదుమూఁడువేల వర్షము, లెలమిన్.

92 క. సచ్చరితులైన దివిజులు,
విచ్చలవిడిసంచరించ, వీలయ్యె, నిఁకన్,
వచ్చినపనియిదె, యని, హరి
చెచ్చెరఁ, దనమొదలినెలవు, సేరం, జనియెన్.

93 క. రాక్షసబాధలు తరుచై,
ఈక్షితిఁగలవేళలందు, నీశుండు, ఖలులన్
శిక్షింపఁ, బ్రతియుగంబున,
దక్షుండై వెలసిఁ సలుపుఁ దానవకేలిలన్.

94 క. వరమహిమకతన, రావణు
హరియింపన్, ధరణి, మానవాకృతి తోడన్
హరిపుట్టవలసె, వానర
పరివారముఁ జేకొనంగ వలసెన్, లీలన్.

95 క. వివిధములగు రాక్షసులను,
వివిధోపాయములఁ ద్రుంచి, వేడుకల, ట్లీ
వివిధకథలఁ గల్పించుచు,
నవనీభారంబుమాన్పె, ననఘుఁడు, గరుణన్.

96 క. ధర్మము, సత్యము, శీలము,
నిర్మలఘనభక్తి, నీతి, నిఖిలార్థములన్,
బేర్మిని, రాముఁడు, నిలిపెను,
దుర్మదులగు రాక్షసాళిఁ ద్రుంచి, ధరిత్రిన్.

97 క. వనితాసుతాదులుండుట,
వనములపాలగుట, చాలఁబ్రాకృతునివలెఁ,
వనటొందుటాదికృత్యము,
లినకులతిలకునకు, మేటి లీలలుగావే?

98 క. ధరఁగలజనములకు, సుదా
హరణముఁజూపించి, పాపహరుఁడై, గురుఁడై,
వరదాత, దైవమై, నిజ
చరితంబును దెల్పె, రామచంద్రుఁడు, జగతిఁ.

99 క. నారాయణుఁడగు రాముని,
కా రావణుఁడనఁగ నెంత? యంబుధు లెంతో?
పోరాటమెంత? కపిసహ
కారంబది యెంత? క్రీడగాదే, హరికిన్?

100 క. పరమేశుపాదసేవా
పరుఁడై, తత్కథలవినుచుఁ, బాడుచు, మది, సు
స్థిర భక్తిఁ గూడి, యాడుచుఁ,
బరునిన్, దుదిఁ, జేరుకన్న, భాగ్యములున్నే?

101 క. హరణంబులు దురితములకుఁ,
దరణంబులు కర్మబంధ తతులకు, దివ్యా
భరణంబులు సెవులకు, ఘన
శరణంబులు, రామనామ సంస్మరణంబుల్.

102 క. రామాయణశతకము, శ్రీ
రామాంకితమగుట, మిగుల రమణీయంబై,
ఈమహి వెలయును దిరమై,
రామా! నన్నాశ్రితు సిరాజు రక్షింపఁగదే.

